2.10.85

# గాంధీజీ తుదివిలాపం

"ఉదారమైన ఆశయాలతోపుట్టి,సంస్తవనీయమైన విజయాలనుసాధించిన భారతజాతీయ కాంగ్రెస్‌లో ఇప్పుడు ప్రవేశించిన అవినీతిని, కుళ్లును బయట పెట్టకపోతే ఘోరమైన పాపం మట్టుకుంటుంది. ప్రజాప్రతినిధులుగా చెప్పకునే శాసనసభ్యుల మూలాననే ఈ కుళ్లు పుట్టింది. ఈ అవినీతిని, కుళ్లును, నిర్మూలిస్తామని బిగ్గరగా చెపుతూనే దీనిని మరింత వృద్ధిచేస్తున్నారు. లైసెన్సులు సంపాదించడానికి డబ్బు ఖర్చు పెడుతున్నారు. ఘోరమైన, బ్లాకు మార్కెటింగు చేస్తున్నారు. న్యాయవిచారణ కర్తలను కూడా కళంక పరుస్తున్నారు. ప్రతిపక్షాలులేని ఈ రాజ్యంలో 380 మంది కాంగ్రెస్ శాసనసభ్యులు భయంకరమైన మహమ్మారి జాడ్యంలాగ తయారైనారు. తెల్లదోపిడీదారులకు బదులుగా నల్ల దోపిడీ దారులను పెట్టుకోవడానికేనా ఈ స్వాతంత్ర్య సముపార్జనకై ఇంతమంది ప్రాణాలు బలి యిచ్చింది? ఇంతమంది మహోత్యాగాలు చేసినది యిందుకోసమేనా? ఈ కుళ్లు ఊబిలో నుంచి బయటపడితే గాని దేశం బాగుపడదు. సభ్యులసంఖ్య తగ్గితే చెడుగులు కొన్ని తగ్గుతాయి. అసెంబ్లీలో నుండి కొందరు కౌన్సిలులో ఉంటే చాలదా? ఈ సూత్రాన్ని మన రాజ్యాంగవేత్తలామోదిస్తారా? ఈ తలబరువు నుండి, పీడనుండి ప్రజలను కాపాడతారా?

ఏ రాజకీయ పక్షమయినా దేశప్రజల క్షేమంకోసమే బ్రతకాలి. అందరూ అధికారం కోసం పెనుగులాడుతూవుంటే దేశమేమికావాలి?" అని గాంధీమహాత్ముడు చనిపోయే నాటికి కొద్దిరోజుల ముందు (1948 జనవరి 11-వ) ఢిల్లీలో జరిగిన ప్రార్థనసభలో విలపించాడు!

నాటినుండి 37 సంవత్సరాలు దాటినా ఈ దుస్థితి మారలేదు. గాంధీమహాత్ముని ప్రవంగానికి ముందు ఆరునెలల క్రిందట 1947 ఆగష్టు 15వ తేదీ నుండి ఇండియాలో అధినివేశరాజ్యము సాధించే రాజ్యాంగపట్టాన్ని బ్రిటీషు పార్లమెంటు వారు చేశారు. గాంధీ మహాత్ముని నమ్మినబంటు పండిత జవహర్లాల్ నెహ్రూ ఈ కొత్త ప్రభు త్వంలో ప్రధానమంత్రియైనారు. ఇంకొక శిష్యుడైన వల్లభభాయి పటేల్ ఉపప్రధాని, హోంమంత్రి యైనారు. కాంగ్రెస్ ప్రముఖులు కొందరు మంత్రులైనారు. కాంగ్రెస్ పక్షం వారు కొందరు కేంద్ర శాసనసభ్యులైనారు.

కాంగ్రెస్ కార్యకర్తలు అధికారం కొరకు పెనుగులాడుతూ అధికారాన్ని స్వలాభం కోసం ఉపయోగించుకోవడం ప్రారంభించారు. శాసనసభలో బలమైన ప్రతిపక్షం లేనందు వల్ల కాంగ్రెస్ వారి చర్యలనుగూర్చి అడిగేవారేలేరు. అందువల్ల కుళ్లు ప్రబల సాగింది. అయితే గాంధీమహాత్ముడు 1921 సంవత్సరంలో సంస్కరించిన జాతీయ కాంగ్రెస్ మహాసభలో గ్రామస్థాయినుంచి రాష్ట్రస్థాయివరకు గల సంఘాలకు సక్రమంగా ఎన్నికలు జరుగుతూ ప్రజాప్రతినిధులుగల అఖిలభారత కాంగ్రెస్ కమిటీ కార్యవర్గమూ, దాని అధ్యక్షుడూ సక్రమంగా పనిచేస్తూ ప్రతియేటా మహాసభ సమావేశాలు జరుగుతూ ఉండేవి. అందులో కాంగ్రెస్ ప్రభుత్వ మంత్రులు కూడా సభ్యులుగా ఉన్నందువల్ల కాంగ్రెస్ విధానాలలోని లోటుపాట్లు చర్చించడానికి కొంత అవకాశము కలిగి ప్రజా ప్రభుత్వము కొనసాగుతూవుంది. అయితే ఆనాటి ప్రధానమంత్రి ఉపప్రధాని కూడా కాంగ్రెస్ మహానాయకులైనందువల్ల కొంతకాలము నుండి అప్పటి కాంగ్రెస్ అధ్యక్షులైన కృపలానీగారితో సంప్రదించకుండానే తమ ప్రభుత్వం సాగించుట ప్రారంభించారు. అంతట కృపలానీ గాంధీమహాత్ముని సమక్షంలో జరిగిన కార్యవర్గ సభలో తమ పదవికి రాజీనామా చేశారు.

కృపలానీగారు రాజీనామా చేయడం న్యాయమేనని మహాత్ముడు దానిని ఆమోదిస్తూ ఆయన స్థానములో అప్పట్లో కాంగ్రెస్‌లోని సోషలిస్టు పక్ష నాయకుడైన నరేంద్రదేవు గారిని అధ్యక్షునిగా చేస్తే ప్రభుత్వ విధానాల మంచిచెడ్డలు న్యాయంగా విమర్శించడానికి ప్రజాప్రభుత్వ సంప్రదా యాలు కొనసాగడానికి అవకాశము కలుగుతుందని అన్నారు. అయితే కాంగ్రెస్ కార్యనిర్వాహక సంఘ సభ్యులు నరేంద్ర దేవుగారివంటి స్వతంత్ర భావాలుకల వారిని అధ్యక్షునిగా చేయడానికి ఇష్టపడక మితవాద భావాలుగల సౌమ్యస్వభావముగల రాజేంద్ర ప్రసాద్ గారిని అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. ఇలాగ గాంధీ మహాత్ముని శిష్యులే ఆయన సలహా త్రోసికరించారు! 1950 సంవత్సరం జనవరి 26వ తేదీన స్వతంత్రభారత రాజ్యాంగం అమలులోకి రాగా భారత ప్రజాస్వామిక రాజ్యానికి రాజేంద్రప్రసాద్‌గారు రాష్ట్రపతియైనారు. 1950 సంవత్సరమునకు పూర్వము కొన్ని సంవత్సరాలనుండి వల్లభభాయి పటేలు గారికి నెహ్రూగారికి అభిప్రాయభేదాలు కలిగి పడడంలేదుగాని గాంధీమహాత్మునిపట్ల గల భయభక్తుల వల్ల సర్దుకునిపోయేవారు. ఈ స్థితిలో 1950 సం: డిసెంబరు నెలలో పటేలుగారు స్వర్గస్థులుకాగా నెహ్రూగారికి ఎదురుమాట్లాడేవారే లేకపోయారు. వారాడినది ఆట పాడినది పాటయైనది.,

ప్రధానమంత్రి చుట్టూ స్వార్థపరులు, ఇచ్చకాలవారు, జోహుకుములు చేరారు. గాంధీ మహాత్ముని తుది విలాపములోని కాలజ్ఞానము ప్రకారము అవినీతి వృద్ధియైనది, దేశమధో గతికి దిగింది. ఇందిరాగాంధీ కాలంలో జాతీయ కాంగ్రెస్ అంతరించిపోయింది.

—దిగవల్లి వెంకటశివరావు